# అథ సప్తత్రింశో%ధ్యాయః

# ధుంధు వధ వర్ణనము

సూత ఉవాచ|

పూర్వ్వతస్తు మనోర్జజ్ఞే ఇక్ష్వాకుర్ఘ్రాణతస్సుతః | తస్య పుత్రశతం త్వాసీదిక్ష్వా కోర్భూరిదక్షిణమ్ || 1

తేషాం పురస్తాదభవన్నార్యావర్తే నృపా ద్విజాః | తేషాం వికుక్షిర్జ్యేష్ఠస్తు సో% యోధ్యాయాం నృపో%భవత్ || 2

తత్కర్మశృణు తత్ర్పీత్యా యజ్జాతం వంశతో విధేః| శ్రాద్ధకర్మణి చోద్దిష్టో హ్యకృతే శ్రాద్ధకర్మణి| 3

భక్షయిత్వా శశం శీఘ్రం శశా దత్వమతో గతః | ఇక్ష్వాకుణా పరిత్యక్తశ్శశాదో వనమావిశత్ || 4

ఇక్ష్వాకౌ సంస్థితే రాజా వసిష్ఠవచనాదభూత్ | శకునిప్రముఖాస్తస్య పుత్రాః పంచదశ స్మృతాః || 5

ఉత్తరాపథదేశస్య రక్షితారో మహీక్షితః | అయోధస్య తు దాయాదః కకుత్స్థో నామ వీర్యవాన్|| 6

అరినాభః కకుత్స్థస్య పృథురేతస్య వై సుతః | విష్టరాశ్వః పృథోః పుత్రస్తస్మాదింద్రః ప్రజాపతిః || 7

ఇంద్రస్య యువనాశ్వస్తు శ్రావస్తస్య ప్రజాపతిః | జజ్ఞే శ్రావస్తకః ప్రాజ్ఞః శ్రావస్తీ యేన నిర్మితా |

శ్రావస్తస్య తు దాయాదో బృహదశ్వో మహాయశాః || 8

యువనాశ్వస్సుతస్తస్య కువలాశ్వశ్చ తత్సుతః | స హి ధుంధువధాద్భూతో ధుంధుమారో నృపోత్తమః || 9

కువలాశ్వస్య పుత్రాణాం శతముత్తమధన్వినామ్ | బభూవాత్ర పితా రాజ్యే కువలాశ్వం న్యయోజయత్ || 10

పుత్రసంక్రామితశ్రీకో వనం రాజా సమావిశత్ | తముత్తంకో%థ రాజర్షిం ప్రయాంతం ప్రత్యవారయత్|| 11

సూతుడు ఇట్లు పలికెను -

పూర్వము మనువునకు ముక్కునుండి ఇక్ష్వాకువు అనే పుత్రుడు జన్మించెను. ఆ ఇక్ష్వాకువునకు వంద మంది పుత్రులు కలిగిరి. వారు గొప్ప దక్షిణలను ఇచ్చిరి (1). ఓ బ్రాహ్మణులారా! వారికి పూర్వము ఆర్యావర్తములో రాజులు లేకుండిరి. వారిలో వికుక్షి పెద్దవాడు. ఆతడు అయోధ్యకు రాజు ఆయెను (2). ఆతడు ఒకనాడు స్వీయరాగము వలన చేసిన ఒక కర్మను గురించి వినుము. ఆ ఘటన విధివిధానము వలన జరిగినది. ఆతడు శ్రాద్ధకర్మను చేయవలసి యుండెను. కాని ఆతడు శ్రాద్ధకర్మను చేయకుండగనే (3), కుందేలును భక్షించి, వెంటనే శశాదుడు అను పేరును పొందెను. ఇక్ష్వాకువు శశాదుని బహిష్కరించగా, ఆతడు అడవిలోనికి ప్రవేశించెను (4). ఇక్ష్వాకుడు మరణించిన తరువాత వసిష్ఠుని ఆదేశముపై శశాదుడు రాజు ఆయెను. ఆయనకు శకుని మొదలగు పదిహేనుమంది పుత్రులు గలరని చెప్పబడినది (5). వారు రాజులై ఉత్తరాపథమును పాలించిరి. అయోధుని పుత్రుడు పరాక్రమశాలియగు కకుత్స్థుడు (6). కకుత్స్థుని పుత్రుడు అరినాభుడు ఆయన పుత్రుడు పృథువు. పృథవుయొక్క పుత్రుడు విష్టరాశ్వుడు. ఆయన పుత్రుడు లోకపాలకుడగు ఇంద్రుడు (7). ఇంద్రుని కొడుకు యువనాశ్వుడు. ఆయన శ్రావస్తనగరప్రజలను పాలించెను. ఆయన కొడుకు బుద్ధిశాలియగు శ్రావస్తకుడు. శ్రావస్తీ నగరమును ఆయనయే నిర్మించెను. శ్రావస్తుని కుమారుడు గొప్ప కీర్తిశాలియగు బృహదశ్వుడు (8). వాని కుమారుడు యువనాశ్వుడు. వాని కుమారుడు కువలాశ్వుడు. ఆ రాజశ్రేష్ఠుడు ధుంధువును వధించి ధుంధుమారుడు అయినాడు (9). కువలాశ్వునకు ఉత్తములగు

ధనుర్ధారులైన వంద మంది పుత్రులు గలరు. కువలాశ్వుని తండ్రి ఆయనను రాజ్యములో నియోగించెను (10). ఆ రాజర్షి సంపదను కొడుకునకు అప్పజెప్పి అడవికి వెళ్లుచుండగా, ఆయనను ఉత్తంకుడు వారించెను (11).

ఉత్తంక ఉవాచ|

భవతా రక్షణం కార్యం పృథివ్యా ధర్మతః శృణు | త్వయా హి పృథివీ రాజన్ రక్ష్యమాణా మహాత్మనా || 12

భవిష్యతి నిరుద్విగ్నా నారణ్యం గంతుమర్హసి | మమాశ్రమసమీపే తు హిమేషు మరుధన్వసు || 13

సముద్రవాలుకాపూర్ణో దానవో బలదర్పితః | దేవతానామవధ్యో హి మహాకాయో మహాబలః | 14

అంతర్భూమిగతస్తత్ర వాలుకాంతర్హితః స్థితః | రాక్షసస్య మధోః పుత్రో ధుంధునామా సుదారుణః || 15

శేతే లోకవినాశాయ తవ ఆస్థాయ దారుణమ్ | సంవత్సరస్య పర్యంతే స నిశ్వాసం విముంచతి || 16

యదా తదా భూశ్చలతి సశైలవనకాననా | సవిస్ఫులింగం సాంగారం సధూమమపి వారిణా || 17

తేన రాజన్న శక్నోమి తస్మింస్థాతుం స్వ ఆశ్రమే | తం వారయ మహాబాహో లోకానాం హితకామ్యయా || 18

లోకాస్స్వస్థా భవంత్వద్య తస్మిన్ వినిహతే త్వయా | త్వం హి తస్య వధాయైవ సమర్థః పృథివీపతే || 19

విష్ణునా చ వరో దత్తో మహాన్ పూర్వయుగే% నఘ| తేజసా స్వేన తే విష్ణుస్తేజ ఆప్యాయయిష్యతి || 20

పాలనే హి మహాధర్మః ప్రజానామిహ దృశ్యతే | న తథా దృశ్యతే%రణ్యే మా తే భూద్బుద్ధిరీదృశీ || 21

ఉత్తంకుడు ఇట్లు పలికెను -

నా మాటను వినుము. నీవు ధర్మబద్ధముగా భూలోకమును రక్షించవలెను. ఓ రాజా! మహాత్ముడవగు నీచే రక్షింపబడి యున్న ఈ భూమియందు ఆపదలు ఉండవు. కావున, నీవు అడవికి పోదగదు. నా అశ్రమమునకు సమీపములో సముద్రపు ఇసుకతో నిండి మంచుతో కప్పబడియుండే చవిటి పఱ్ఱయందు బలముచే గర్వించియున్న వాడు, దేవతలకైననూ సంహరింప శక్యము కాని వాడు, పెద్ద దేహము గలవాడు, మహాబలశాలి, మిక్కిలి క్రూరుడు అగు రాక్షసుడు భూమి లోపల ఇసుకచే కప్పబడి దాగియున్నాడు. వీని పేరు ధుంధుడు. ఈతడు మధురాక్షసుని పుత్రుడు (12 - 15). ఆతడు అచటనున్నవాడై లోకవినాశము కొరకు దారుణమగు తపస్సును చేయుచున్నాడు. ఆతడు సంవత్సరకాలము గడువగానే నిశ్శ్వాసను విడిచిపెట్టును (16). అప్పుడు పర్వతములతో, అడవులతో మరియు విశాలమగు మైదానములతో కూడియున్న భూమి కంపించును. ఆ భూభాగము కాలే కట్టెలతో, ఎగిరిపడే అగ్నికణములతో, నీటితో మరియు పొగతో నిండును (17). ఓ రాజా! ఆ కారణముగా నేను నా ఆ ఆశ్రమములో నిలువలేకున్నాను. ఓ గొప్ప బాహువులు గలవాడా! లోకముల హితమును గోరి నీవు వాని బెడదను తప్పించుము (18). ఈనాడు నీచే వాడు సంహరింపబడి లోకములు సుఖమయములు అగుగాక!ఓ మహారాజా! వానిని సంహరించుటకు నీవు మాత్రమే సమర్థుడవు (19). ఓ పుణ్యాత్మా! గడచిన యుగములో విష్ణుపు గొప్ప వరమును ఇచ్చియున్నాడు. విష్ణువు తన తేజస్సుచే నీ తేజస్సును వర్ధిల్లజేయగలడు (20). ఈ లోకములో ప్రజలను రక్షించుట మహాధర్మము అగును. అడవిలో అంతటి మహాధర్మమును నీవు చేయజాలవు. కావున, నీకు అడవికి వెళ్లవలెననే ఈ బుద్ధి కలుగకుండుగాక! (21)

ఈదృశో న హి రాజేంద్ర క్వచిద్ధర్మః ప్రవిద్యతే | ప్రజానాం పాలనే యాదృక్ పురా రాజర్షిభిః కృతః || 22

స ఏవముక్తో రాజర్షిరుత్తంకేన మహాత్మనా | కువలాశ్వస్సుతం ప్రాదాత్తసై#్మ ధుంధునివారణ || 23

భగవన్న్యస్తశస్త్రో%హమయం తు తనయో మమ | భవిష్యతి ద్విజశ్రేష్ఠ ధుంధుమారో న సంశయః || 24

ఇత్యుక్త్వా పుత్రమాదిశ్య య¸° స తపసే నృపః | కువలాశ్వశ్చ సోత్తంకో య¸° ధుంధువినిగ్రహే || 25

తమావిశత్తదా విష్ణుర్భగవాంస్తేజసా ప్రభుః| ఉత్తంకస్య నియోగాద్వై లోకానాం హితకామ్యయా || 26

తస్మిన్ ప్రయాతే దుర్ధర్షే దివి శబ్దో మహానభూత్ | ఏష శ్రీమాన్నృపసుతో ధుంధుమారో భవిష్యతి || 27

దివ్యైర్మాల్యైశ్చ తం దేవాస్సమంతాత్సమవారయన్ | ప్రశంసాం చక్రిరే తస్య జయ జీవేతి వాదినః || 28

స గత్వా జయతాం శ్రేష్ఠస్తనయైస్సహ పార్థివః | సముద్రం ఖనయామాస వాలుకార్ణవమధ్యతః || 29

నారాయణస్య విప్రర్షే తేజసాప్యాయితస్తు సః | బభూవ సుమహాతేజా భూయో బలసమన్వితః || 30

తస్య పుత్రైః ఖనద్భిస్తు వాలుకాంతర్గతస్తు సః | ధుంధురాసాదితో బ్రహ్మన్ దిశమాశ్రిత్య పశ్చిమామ్ || 31

ఓ మహారాజా! పూర్వము రాజర్షులు ప్రజారక్షణము అనే ధర్మమును నిర్ధారించి యున్నారు. ఇట్టి ధర్మము మరియొకటి ఎక్కడనైననూ లేదు (22). మహాత్ముడగు ఉత్తంకుడు ఇట్లు పలుకగా, ఆ రాజర్షి తన పుత్రుడగు కువలాశ్వుని ధుంధుసంహారము కొరకై అయనకు

అప్పుడెప్పెను (23). ఓ పూజ్యా! నేను ఆయుధములను పరిత్యజించితిని. ఈతడు నా కొడుకు. ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! ఈతడు నిస్సందేహముగా ధుంధువును సంహరించగలడు (24). ఆ మహారాజు ఇట్లు పలికి, పుత్రుడగు కువలాశ్వుని ఆదేశించి తపస్సునకు వెళ్లెను. ఆ కువలాశ్వుడు ఉత్తంకునితో గూడి ధుంధువును సంహరించుటకు వెళ్లెను (25). అపుడు సర్వసమర్థుడగు విష్ణుభగవానుడు ఉత్తంకుని ప్రార్థనను స్వీకరించి లోకముల హితమును గోరి తన తేజస్సుచే ఆ రాజును ఆవేశించెను (26). జయింప శక్యము కాని కువలాశ్వుడు బయలు దేరగానే స్వర్గమునందు పెద్ద శబ్దము బయలు దేరెను. శోభిల్లే ఈ మహారాజకుమారుడు ధుంధువును సంహరించగలడు అను వచనములు వినబడెను (27). దేవతలు ఆతనిని దివ్యములగు మాలలతో అన్ని వైపులనుండియు చుట్టుముట్టిరి. వారు. 'నీకు జయమగుగాక! చిరకాలము జీవించుము' అని పలుకుతూ ఆయనను ప్రశంసించిరి (28). విజేతలలో శ్రేష్ఠుడగు ఆ మహారాజు కొడుకులతో గూడి వెళ్లి, విస్తీర్ణమగు ఆ ఇసుకమైదానము మధ్యలో సముద్రమును త్రవ్వించెను (29). ఓ విప్రర్షీ! నారాయణుని తేజస్సుచే వర్ధిల్ల జేయబడిన ఆ మహతేజశ్శాలియగు రాజు మరింత బలము గల వాడు ఆయెను (30). ఓ బ్రాహ్మణా ! ఆయన పుత్రులు త్రవ్వుచూ, ఇసుక లోపల పశ్చిమదిక్కును ఆశ్రయించుకొని యున్నధుంధుని సమీపించిరి (31).

ముఖజేనాగ్నినా క్రోధాల్లోకాన్ సంవర్తయన్నివ| వారి సుస్రావ వేగేన విధోః కధిరివోదయే || 32

తతో% నలైరభిహతం దగ్ధం పుత్రశతం హి తత్| త్రయ ఏవావశిష్టాశ్చ తేషు మధ్యే మునీశ్వర || 33

తతస్స రాజా విప్రేంద్ర రాక్షసం తం మహాబలమ్| ఆససాద మహాతేజా ధుంధుం విప్రవినాశనమ్|| 34

తస్య వారిమయం వేగమాపీయ స నరాధిపః | వహ్నిబాణ   న వహ్నిం
తం శమయామాస వారిణా || 35

తం నిహత్య మహాకాయం బలేనోదకరాక్షసమ్ | ఉత్తంకస్యేక్షయామాస
కృతం కర్మనరాధిపః || 36

ఉత్తంకస్తు వరం ప్రాదాత్తస్మై#్మ రాజ్ఞే మహామునే | అదదచ్చాక్షయం
విత్తం శత్రుభిశ్చాపరాజయమ్ || 37

ధర్మేమతిం చ సతతం స్వర్గే వాసం తథాక్షయమ్ | పుత్రాణాం
చాక్షయం లోకం రక్షసా యే తు సంహతాః || 38

తస్య పుత్రాస్త్రయశ్శిష్టాః దృఢాశ్వః శ్రేష్ఠ ఉచ్యతే |
హంసాశ్వకపిలాశ్వౌచ కుమారౌ తత్కనీయసౌ || 39

ధౌంధుమారిర్ధృఢాశ్వో యో హర్యశ్వస్తస్య చాత్మజః | హర్యశ్వస్య
నికుంభోభుత్పుత్రో ధర్మరతస్సదా || 40

సంహతాశ్వో నికుంభస్య పుత్రో రణవిశారదః | అక్షాశ్వశ్చ కృతాశ్వశ్చ
సంహతాశ్వసుతో%భవత్ || 41

ఆతడు తన నోటినుండి వెలువడిన అగ్నితో లోకములను కాల్చివేయుచున్నాడా యన్నట్లు ఉండెను. చంద్రకిరణములచే చంద్రకాంతి మణినుండివలె ఆతని నోటినుండి నీరు కూడ వేగముగా ప్రవహించెను (32). అపుడు ఆ అగ్ని ఆ వందమంది పుత్రులను ఆక్రమించి, తగులబెట్టెను. ఓ మహర్షీ! వారిలో ముగ్గురు మాత్రమే మిగిలిరి (33). ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! అపుడు మహతేజశ్శాలియగు ఆ రాజు మహబలుడు, బ్రాహ్మణహంతకుడు అగు ధుంధుడనే ఆ రాక్షసునిపై పరాక్రమించెను. (34). ఆ మహారాజు వానినుండి వెలువడుచున్న జలధారలను ఆగ్నేయాస్త్రముచే ఎండగొట్టి అగ్నిని నీటితో చల్లార్చెను (35). ఆ మహారాజు పెద్ద శరీరము గలిగి నీటియందు ఉండే ఆ రాక్షసుని స్వీయబలముచే సంహరించి తాను చేసిన కర్మను ఉత్తంకునకు ప్రదర్శించెను (36). ఓ

మహర్షీ! ఉత్తంకుడు ఆ రాజునకు వినాశము లేని సంపదను, శత్రువుల చేతిలో పరాజయము లేకుండుటను, సర్వదా స్థిరముగా నుండే ధర్మబుద్ధిని, స్వర్గములో శాశ్వతనివాసమును, రాక్షసునిచే సంహరింపబడిన పుత్రులకు శాశ్వతపుణ్యలోకమును వరములుగా నొసంగెను (37,38). ఆ మహారాజునకు మిగిలిన ముగ్గురు పుత్రులలో దృఢాశ్వుడు పెద్దవాడు. హంసాశ్వుడు, కపిలాశ్వుడు ఆతని సోదరులు (39). ధుంధుమారునియొక్క పుత్రుడగు దృఢాశ్వునకు హర్యశ్వుడనే పుత్రుడు కలిగెను. హర్యశ్వునకు సర్వకాలములలో ధర్మమునందు ప్రీతి గల నికుంభుడు అనే పుత్రుడు కలిగెను. (40). యుద్ధనిపుణుడగు సంహతాశ్వుడు నికుంభుని పుత్రుడు. సంహతాశ్వునకు అక్షాశ్వుడు, కృతాశ్వుడు అనే పుత్రులు గలరు (41).

తస్యహైమవతీ కన్యాసతాం మాన్యా వృషద్వతీ| విఖ్యాతా త్రిషు లోకేషు పుత్రస్తస్యాః ప్రసేనజిత్| 42

లేభే ప్రసేనజిద్భార్యాం గౌరీం నామ పతివ్రతామ్ | అభిశప్తా తు సా భర్త్రా నదీ సా బాహుదా కృతా || 43

తస్య పుత్రో మహానాసీద్యువనాశ్వో మహీపతిః | మాంధాతా యువనాశ్వస్య త్రిషు లోకేషు విశ్రుతః || 44

తస్య చైత్రరథీ భార్యా శశబిందుసుతా% భవత్ | పతివ్రతా చ జ్యేష్ఠా చ భ్రాతౄ ణామయుతం చసః || 45

తస్యాముత్పాదయామాస మాంధాతా ద్వౌసుతౌ తదా | పురుకుత్సం చ ధర్మజ్ఞం ముచుకుందం చ ధార్మికమ్ || 46

పురుకుత్ససుతస్త్వాసీద్విద్వాంస్త్రయ్యారుణిః కవిః | తస్య సత్యవ్రతో నామ కుమారో% భూన్మహాబలీ || 47

పాణిగ్రహణమంత్రాణాం విఘ్నం చక్రే మహాత్మభిః | యేన భార్యా హృతా పూర్వం కృతోద్వాహః పరస్య వై || 48

బలాత్కామాచ్చ మోహాచ్చ సంహర్షాచ్చ యదోత్కటాత్ | జహార కన్యాం కామాచ్చ కస్య చిత్పురవాసినః || 49

అధర్మసంగినం తం తు రాజా త్రయ్యారుణిస్త్యజన్ | అపధ్వంసేతి బహుశో% వదత్క్రోధసమన్వితః || 50

పితరం సో% బ్రవీన్ముక్తః క్వ గచ్ఛామీతివై తదా | వస శ్వపాకనికటే రాజా ప్రాహేతి తం తదా || 51

ఆయనకు సత్పురుషులచే ఆదరింపబడే హైమవతి, మరియు ముల్లోకములలో కీర్తిని గాంచిన వృషద్వతి అను కన్యలు గలరు. వృషద్వతియొక్క పుత్రుడు ప్రసేనజిత్తు (42). ప్రసేనజిత్తు గౌరి అనే పతివ్రతను భార్యగా పొందెను. భర్త ఆమెను శపించి బాహుద అనే నదిగా చేసెను (43). ఆయనకు యువనాశ్వుడనే గొప్ప రాజు పుత్రుడాయెను. ముల్లోకములలో పేరు బడసిన మాంధాత యువనాశ్వుని పుత్రుడు (44). శశిబిందుని కుమార్తె యగు చైత్రరథి ఆయనకు భార్య ఆయెను. ఆ పతివ్రత పదివేలమంది సోదరులకు అక్క. మాంధాతకు ఆమెయందు ఇద్దరు ధర్మాత్ములగు పుత్రులు కలిగిరి. పురుకుత్సుడు, ముచుకుందుడు అనునవి వారి పేర్లు (45,46). విద్వాంసుడు, కవియగు త్రయ్యారుణి పురుకుత్సుని కుమారుడు. వానికి మహాబలశాలియగు సత్యవ్రతుడనే కొడుకు కలిగెను (47). మహాత్ములు ఇతరుల వివాహసమయములో పఠించే మంత్రములకు ఆతడు విఘ్నములను కలిగించి వివాహమైన తరువాత నూతన వధువును అపహరించెవాడు. (48). ఆతడు ఒకనాడు కామమోహితుడై బలగర్వితుడై భోగలాలసుడై ఒకానొక పౌరుని కన్యను బలాత్కారముగా అపహరించెను (49). త్రయ్యారుణి మహారాజు క్రోధముతో నిండిన మనస్సు గలవాడై అధర్మాత్ముడగు ఆ కొడుకును 'ఓరీ భ్రష్టుడా!' అని పలువిధములుగా నిందించి బహిష్కరించెను (50). అపుడు బహిష్కరించబడిన ఆ కుమారుడు

తండ్రిని 'నేను ఎచటకు పోయెదను?' అని ప్రశ్నించగా, అపుడా రాజు వానిచో 'శునకమాంసభక్షకుల సమీపములో నివసించుము'అని పలికెను (51)

స హి సత్యవ్రతస్తేన శ్వపాకావసథాంతికే | పిత్రా త్యక్తో%వసద్ధీరో ధర్మపాలేన భూభుజా || 52

తతస్త్రయ్యారుణీ రాజా విరక్తః పుత్రకర్మణా | స శంకరతపః కర్తుం సర్వం త్యక్త్వా వనం య¸°|| 53

తతస్తస్య స్వవిషయే నావర్షత్పాకశాసనః | సమా ద్వాదశ విప్రర్షే తేనాధర్మేణవై తదా || 54

దారాం తస్య తు విషయే విశ్వామిత్రో మహాతపాః| సంత్యాజ్య సాగరానూపే చచార విపులం తపః || 55

తస్య పత్నీ గలే బద్ధ్వా మధ్యమం పుత్రమౌరసమ్ | శేషస్య భరణార్థాయ వ్యక్రీచ || 56

తాం తు దృష్ట్వా గలే బద్ధం విక్రీణంతీం స్వమాత్మజమ్ | మహర్షిపుత్రం ధర్మాత్మా మోచయమాస తం తదా || 57

సత్యవ్రతో మహాబాహుర్భరణం తస్య చాకరోత్ | విశ్వామిత్రస్య తుష్ట్యర్థమనుక్రోశార్థమేవ చ|| 58

తదారభ్య స పుత్రస్తు విశ్వామిత్రస్య వై మునేః | అభవద్గాలవో నామ గలబంధాన్మహాతపాః || 59

ఇతి శ్రీశివమహాపురాణ ఉమాసంహితాయాం ధుంధువధవర్ణనం నామ సప్తత్రింశో%ధ్యాయః (37).

ధర్మాత్ముడగు రాజు మరియు తండ్రి అగు త్రయ్యారుణిచే బహిష్కరించబడిన ధీరుడగు సత్యవ్రతుడు శునకమాంసభక్షకుల ఇంటికి సమీపములో నివసించెను (52). తరువాత తన కుమారుడు

చేసిన పనిచే వైరాగ్యమును పొందిన ఆ త్రయ్యారుణి మహారాజు సర్వమును విడిచిపెట్టి శంకరుని ఉద్దేశించి తపస్సును చేయుటకై అడవికి వెళ్లెను (53). ఓ బ్రహ్మర్షీ! అపుడు ఆ అధర్మముచే ఇంద్రుడు ఆ రాజ్యములో పన్నెండు సంవత్సరములు వర్షించలేదు (54). ఆ రాజ్యములో గొప్ప తపశ్శాలియగు విశ్వామిత్రుడు భార్యను విడిచి పెట్టి సముద్రతీరములో జలసమృద్ధమగు స్థానములో విస్తారమైన తపస్సును చేసెను. (55). ఆయన భార్య తాను కన్న ముగ్గురు పుత్రులలో మిగిలిన వారి పోషణ కొరకై మధ్యమపుత్రుని కంఠమునందు త్రాడుతో కట్టి వంద గోవులకు అమ్మజూపెను (56). మహర్షిపుత్రుడగు తన కొడుకుయొక్క కంఠములో త్రాడును కట్టి అమ్ముటకు సంసిద్ధురాలైన ఆ తల్లిని చూచి ధర్మాత్ముడగు సత్యవ్రతుడు అపుడు అతనిని విడిపించెను (57) గొప్ప బాహువులు గల సత్యవ్రతుడు తన దయాస్వభావము కారణముగా మరియు విశ్వామిత్రునకు ఆనందమును కలగజేయుట కొరకై వాని పోషణకు ఏర్పాటు చేసెను (58). అప్పటినుండియు మహాతపశ్శాలియగు ఆ విశ్వామిత్రమహర్షి యొక్క పుత్రుడు కంఠములో త్రాడుచే కట్టబడుటచే గాలవుడు అను పేరును పొందెను (59).

శ్రీశివమహాపురాణములోని ఉమాసంహితయందు ధుంధువధవర్ణనము అనే ముప్పది ఏడవ అధ్యాయము ముగిసినది (37).